# అక్షరగణపతి - కుండలినీపతి

(The Concept of Ganapathi and Kumara Swamy)



వివరణ

డా॥ జి.ఎల్.ఎస్. శాస్త్రి M.Sc., M. Phil., Ph D.

Reader & Head of the Dept. of Physics

T.J.P.S. College, Guntur.






జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

(THE WORLD TEACHER TRUST – GUNTUR BRANCH)

గుంటూరు - 522002

అక్షర గణపతి - కుండలినీపతి

ప్రథమ ముద్రణ - ఆగస్టు 1995



ప్రాప్తి స్థానము :

జగద్గురు పీఠము

5-10-4, 2/9 బ్రాడీపేట,

గుంటూరు - 522002

ఫోన్ : 338905

వెల : రూ. 6/-

ముద్రణ :

శ్రీలక్ష్మీ గణపతి ప్రింటర్స్, మునిసిపల్ కాంప్లెక్స్,
5/1 బ్రాడీపేట, గుంటూరు.

# ముందుమాట

ఈ 'ముందుమాట'ను చదివిన తరువాతనే పాఠకులు ఇకముందు రాబోయే వ్యాసాలను చదువుతారని నా న్యాయమైన కోర్కెతో ఈ 'ముందుమాట'ను వ్రాస్తున్నాను. ఈ చిన్న పుస్తకంలో రెండు వ్యాసాలున్నాయి. అవి - శివపార్వతుల చిన్నారులైన గణపతి-కుమారస్వాముల గురించి వ్రాసినవి.

అక్షర గణపతి వ్యాసంలో - గణపతి, గజముఖ, వక్రతుండ, లంబోదర, విఘ్నేశ్వర. ప్రణవస్వరూప. వినాయక, సిద్ధి బుద్ధిప్రదాత, శూర్పకర్ణ, మూషికవాహన మొదలైన నామాల సంకేతార్థ, అంతరార్థాలతో గణపతి తత్త్వము,

కుండలినీపతివ్యాసంలో — కుమార, అగ్నిపుత్ర, సుబ్రహ్మణ్య, షణ్ముఖ, శక్తిధర, దేవసేన - వల్లీనాథ మొదలైన నామాల సంకేత, అంతరార్థలతో కుమారస్వామి తత్త్వము—

సహేతుకంగా, సశాస్త్రీయంగా, మంత్రశాస్త్ర, జ్యోతిశ్శాస్త్ర, యోగశాస్త్ర సమన్వయంగా వివరించబడ్డాయి. ఇక ఈ ప్రస్తుత పుస్తకము అందలి వ్యాసాలు ఎలా వెలుగులోకి వచ్చాయో వ్రాస్తాను.

'కుమారస్వామి' వ్యాసం ఎప్పుడో పదేళ్ళ క్రిందటే వ్రాశాను. గణపతి గురించి మాత్రం క్రిందటి సంవత్సరం వ్రాశాను. ఈ ఇద్దరి గురించి తెలుసుకోవాలని తీవ్రంగా తపన చెందగా స్ఫురించిన విషయాలు ఇవి. పూర్తిగా ఇవి నా బుద్ధికి తట్టిన విషయాలు. ఎందరో ఇంతకు పూర్వం నుండి ఇప్పటి వరకు ఈ ఇద్దరి గురించి వ్రాసి ఉండవచ్చును. కాని, ఇంత శాస్త్రీయంగా, సహేతుకంగా, మంత్ర శాస్త్ర' జ్యోతిశ్శాస్త్ర, యోగశాస్త్ర సమన్వయంగా వ్రాయడం బహుశః ఇదే ప్రథమం కావచ్చును. "అంతటి నవ్య భావాలా ?" అంటే - "ఆఁ వాదాపు అంతే!" అంటాను. ఎందుకొచ్చిన విచికిత్స ? చదవండి మీకే తెలుస్తుంది. చదివిన తరువాత అనుమానాలొస్తే అడగవచ్చును. అవి చెప్పవలసినవి, చెప్పగలిగేవి అయితే తప్పకుండా చెప్పడానికి ప్రయత్నిస్తాను.

చిత్రమేమిటంటే - ఈ రెండు వ్యాసాలు శ్రీ విశ్వయోగి విశ్వంజీవారి దృష్టిలో పడ్డాయి. వారు చూచిన తక్షణమే ఒక్క క్షణంగూడా ఆలోచించకుండా "వెంటనే వీటిని పుస్తకరూపంలో ప్రచురించి ప్రజలకు అందుబాటులో ఉంచండి" అని ముచ్చటపడి, నన్ను వెన్నుతట్టి కార్యోన్ముఖుణ్ణి చేశారు. ఆ ప్రోత్సాహ ఫలితమే ఈ చిన్నపుస్తకం. ఇది పూర్తిగా వారి ప్రోత్సాహ సహకారాలతోనే వెలుగులోకి వచ్చిన పుస్తకం. అందుకు నా తరపున, మా జగద్గురు పీఠం, గుంటూరుశాఖ తరపున వారికి మాభక్తిపూర్వక

కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటున్నాను. ఈ పుస్తకం లోని నవ్యభావాలను నాకు స్ఫురించునట్లు అనుగ్రహించిన అస్మద్గురువరేణ్యులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారికి సభక్తి ప్రణామములు. తక్కువ వ్యవధిలో, అంకిత భావంతో ముద్రించి ఇచ్చిన శ్రీలక్ష్మీగణపతి ముద్రణా లయమువారికి, ఈ పుస్తకంలోని వ్యాసాల శుద్ధప్రతులను అందమైన అక్షరమాలికలతో అలంకరించి సిద్ధంచేసిన శ్రీ M. రామమూర్తి గారికి నాహృదయపూర్వక కృతజ్ఞ తలు. వారికి, నాకుటుంబసభ్యులకు శ్రీగణేశ, కుమారుల శుభాశీస్సులు.

"ఈ పుస్తకం - శివపార్వతీ కుమారాంకితం"

గుంటూరు

27-8-95

—జి. ఎల్. ఎన్. శాస్త్రి

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

# విశ్వ సందేశము

అన్ని జన్మలలోకి మానవజన్మ ఉత్తమమైనది. మానవజన్మ లభించుటయే దుర్లభము. అదృష్టవశముగా, దివ్యవరముగా లభించిన మానవజన్మను మానవుడు సద్వినియోగము చేసికొనుటకు సక్రమముగా యత్నించవలెను. మునుముందుగా మనిషిగా నిలిచి, మనీషిగా మారి, మహాత్మునిగా మహాశక్తిస్వరూపునిగా, సాక్షాత్తు మహేశ్వరునిగా, దివ్యపథముపై పయనించాలి.

పరిపూర్ణ మానవత్వమే దివ్యత్వము. సనాతనధర్మం మానవుని పరిపూర్ణ మానవునిగా తీర్చిదిద్దటానికి దోహదపడే మార్గం. ఇది ఒక ప్రాంతమునకో, మతమునకో సంబంధించినది. కాదు. యావత్ మానవజాతికి, యావత్ మానవకళ్యాణమునకు, యావత్ మానవజాతిసమైక్యమునకు మన సనాతన ధర్మం ఎంతయో అవసరము, ఆచరణీయము అయివున్నది.

'వసుధైక కుటుంబము' అని చాటి చెప్పినది సనాతన ధర్మం. 'ఈశ్వరస్సర్వభూతానాం' అని ఎలుగెత్తి చెప్పినది సనాతన ధర్మం. 'ఏకం సత్, విప్రాః బహుధావదంతి' అని చెప్పినది సనాతనధర్మం. 'మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ' అని మనిషి మనిషికి సందేశమిచ్చింది సనాతన ధర్మం. మనిషిని సంస్కరించి, కుటుంబవ్యవస్థను చక్కదిద్ది, గృహమును ప్రశాంతి నిలయ

ముగా మార్చి, తద్వారా యావత్ మానవ సమాజమును ఒక స్వర్గ ధామంగా. ఒక కలియుగ వైకుంఠంగా, ఒక ఆనంద నిలయముగా మార్చటానికి మార్గదర్శకమయింది.

అట్టి సనాతనధర్మాన్ని విస్మరించి, వ్యక్తిని విస్మరించి, కుటుంబమును విస్మరించి సమాజమును బాగుచేయాలని ప్రణాళికలు వేస్తున్నాము కాబట్టి, అన్నిటిలోను అపజయ మును రుచిచూచి, ఇప్పుడు యావత్ ప్రపంచాన్ని ఒక అగ్ని గుండంగా, ఒక అశాంతి నిలయంగా దిగజార్చటానికి, నాగరి కత పేర, విశృంఖల స్వతంత్రత పేర, మితిమీరిన తెలివితేటల పేర సహాయపడుతున్నాము. ఇది విచారించతగ్గ విషయం.

మొట్టమొదటిసారిగా మనిషి సంస్కరించబడాలి. కుటుంబము సంస్కరించబడాలి. తరువాత సమాజము దాని కదే సంస్కరించబబడుతుంది. సంస్కారముగల వ్యక్తులతో విరాజిల్లే కుటుంబములను, గృహములను కలిగిన సమాజము ప్రశాంత పరిమళములను విరజిల్లుతూ ప్రకాశవంతముగా వెలుగొందుతుంది. విశ్వమానవ సమైక్యముతో సుసంఘటి తంగా జీవిస్తూ విశ్వమానవ కళ్యాణాన్ని రుచిచూస్తుంది. ఇదే, ఇదే ముక్కోటి దేవతల దివ్యసంకల్పం. ఇదే, ఇదే సమస్తయోగుల, అవతారమూర్తుల, సిద్ధపురుషుల, మత ప్రవక్తల సంకల్పము. ఇదే ఇదే సమస్త మానవజాతియొక్క ఆశ, ఆకాంక్ష, ఆశయము, లక్ష్యం.

విశ్వమందిరం, కృష్ణనగర్, గుంటూరు

దివ్య ఆశీస్సులతో
విశ్వయోగి విశ్వంజీ

శ్రీమహాగణాధిపతయేనమః

# అక్షరగణపతి

కం॥ అక్షరగణపతి; వాత్స
ల్లక్షణ గుణ, సిద్ధి, బుద్ధి లబ్ధి కరుండున్;
అక్షరకుక్షి; వినాయక;
నిక్షిప్తాధారచక్రనిలయుని గొలుతున్

## దేవుడు-దేవతలు

హిందువులకు దేవుళ్ళు ఎక్కువ అని సాధారణంగా అందరూ అనుకుంటూ ఉంటారు. ఇలా అనుకోడం తప్పు. దేవుడు ఒక్కడే! దేవతలు ఎక్కువ. మనదేహానికి యజమాని అయిన దేహి (దేహాన్ని ధరించినవాడు) ఒక్కడే! కాని ఈ దేహంతోనే ఆ దేహి ఎన్నో పను లను చక్కబెడుతున్నాడు. కంటితో చూస్తున్నాడు. చెవితో వింటు న్నాడు. ముక్కుతో వాసన చూస్తున్నాడు — — ఇలా ఒక్కొక్క ఇంద్రియం ఒక్కొక్క పనిచేస్తోంది. ఒక ఇంద్రియం చేసే పనిని ఇంకొక ఇంద్రియం చెయ్యదు. అందుకని దేహి ఒక్కడే అయినా ఇంద్రియాలు ఎక్కువ సంఖ్యలోనే ఉంటాయి. ఉండాలి గూడా! సరిగ్గా అలాగే ప్రపంచానికి అధినాథుడు ఒక్కడే అయినా అతని ఆజ్ఞకు కట్టుబడి ప్రపంచప్రణాళికను నిర్వర్తించేందుకు ఎంతోమంది

శక్తిమంతులు కావాలి. ఆ వివిధ శక్తులు కలవారే దేవతలు. అంటే మనిషి దేహాన్ని ప్రపంచంతో పోలిస్తే-ఆ దేహాన్ని ధరించినవాడు-దేవుడు, దేహంలోని సమస్త ఇంద్రియాలు—సమస్తదేవతలు అన్న మాట!

## మానవుని విశిష్టత

మనిషికి—మిగిలిన జీవరాశికి ఉన్నముఖ్యమైన భేదాల్లో 'వాక్కు' ఒకటి. మిగతా జీవరాసులకులేని ఒక ప్రముఖమైన సదుపాయం, అవకాశం (OPPORTUNITY), విశేషాధికారం (PRIVILEGE) మాట్లాడగలగడం. మనోభావాలను వ్యక్తం చెయ్యడానికి-ముఖకవళికలు మార్చి, అరిచి, కేకలుపెట్టి చేతులతోను ఇతర శరీరావయవాలతోను సంజ్ఞలు చెయ్యడమేకాకుండా నోరు విప్పి ఒక పద్ధతిగా, నిర్దుష్టమైన భాషతో మాట్లాడగలగడం మానవుడికే సానుకూలం అవుతుంది. ఈ ఒక్క అవకాశం వల్లనే మానవ జన్మ సృష్టిపరిణామంలో ఒక దుర్లభమైన జన్మగాను, మానవజాతి ఒక విశిష్టమైన జాతిగాను పరిగణింపబడ్డాయని చెప్పుకోవచ్చును.

## అక్షరాభ్యాసం

చదువు వచ్చినవాడూ మాట్లాడగలడు, చదువురానివాడూ మాట్లాడగలడు; సంతకం చెయ్యగలవాడూ మాట్లాడగలడు,సంతకం చెయ్యలేనివాడూ మాట్లాడగలడు. అక్షరాలుచదవడంరాకపోయినా, వ్రాయడం రాకపోయినా అనర్గళంగా మాట్లాడగలిగేవాళ్ళు చాలా మంది వుంటారన్నది అబద్ధంకాదు. కాని, చదువు వచ్చినవాడు

మాట్లాడినా, చదువురానివాడు మాట్లాడినా ఆ మాట్లాడే మాటలకు వెనుక ఒక భాష ఉంటుంది. భాషను వ్యక్తపరచేందుకు లిపి వుంటుంది. "భావాలను ఒక భాష ద్వారా కాగితం మీద వ్యక్తపరచేందుకు (మాట్లాడేందుకుకాదు) అవసరమైన గుర్తులనే లేదా సంకేతాలనే- అక్షరాలు" అంటారు. కాగితం మీద వ్రాసిన వాటిని చెరిపేస్తే చెరిగిపోయినా, అవి మనస్సులో చెరిగిపోవు. మనస్సులోంచి చెరిపెయ్యలేము. అందుకనే మళ్ళీ వ్రాయవలసినప్పుడు ఎన్నిసార్లు అంతకు పూర్వం చెరిపివేయబడి, కనబడకుండా పోయినవైనా మళ్ళీ అవి కాగితం మీద వ్రాయబడగలవు.మనంవ్రాయగలం. "క్షరము" అంటే-నశించేవి అనీ, "అక్షరము" అంటే–నశించనిది. అనీ అర్థం. కాబట్టే వాటిని అక్షరాలు అన్నారు. అక్షరాభ్యాసం జరిగే రోజున ఈ అక్షరాలనేఅభ్యసించడం జరుగుతుంది. అభరణాలను కొన్నా, ధరించినా, దాచినా, అవి తిరిగిపోవచ్చు, విరిగిపోవచ్చు లేదా శాశ్వతంగా కనుమరుగైపోవచ్చుగూడా! కాని, అక్షరాలు అలా తిరిగిపోవు, నశించిపోవు. అందుకనే అక్షరాభ్యాసంనాడు మనం పొందేది చెక్కుచెదరని ఆస్తి అన్నమాట! మన ఇంట్లోవున్నవి, మనవంటి మీద వున్నవి అన్నిటినీ దొంగలు ఎత్తుకొనిపోయినా పోవచ్చునేమోకాని, అక్షరాభ్యాసం వల్ల మనం పొందిన "అక్షర జ్ఞానాన్ని" ఎవ్వరూ దొంగలించలేరు. అందుకునే ఈ సంస్కారాన్ని "అక్షరాభ్యాసం" అన్నారు.

## ప్రథముడు-ప్రధానుడు

ఏ శుభాకార్యం చెయ్యాలన్నా, దేవతాకార్యాలు నిర్వహించాలన్నా, ఏ దేవతను ఉపాసించాలన్నా, ఒక విధానం (PROCE

DURE) వుంటుంది. దీన్నే 'కల్పం' అంటారు. కల్పం అంటే— "వ్యక్తమైన పద్ధతిలో కార్యాలను నిర్వహించడానికి అవసరమయే విధానాన్ని తెల్పేశాస్త్రం "అన్నమాట. ఆరు వేదాంగాలలో కల్పం గూడా ఒకటి అని గుర్తించుకోవాలి. ఆ కల్పవిధానంగాని, ఉపాస్య దేవతకు సంబంధించిన మంత్రము, యంత్రము, తంత్రము, స్తోత్రము, బీజాక్షరాలు మొదలైనవి ఏమైనప్పటికీ-అన్నీ-అక్షరాల్లో వ్రాయబడి వుంటాయి. ఆ అక్షరాలకు సంబంధించినదేవతే "గణపతి" అందుకే గణపతి అన్ని దేవతలకు ఆద్యుడు, అగ్రగణ్యుడు; ప్రథముడు, ప్రధానుడు. అందువల్లనే అక్షరాలకు అధిపతి అయిన గణపతిని ముందు ప్రార్థించి, అర్చించి ఆ తరువాతనే మిగతాతంతు అంతా నిర్వహిస్తారు. ఈ వ్యాసం గూడా గణపతి ప్రార్థనతోనే ప్రారంభించడం జరిగింది. ముందు ఈ గణపతి జన్మవృత్తాంతాన్ని తెల్పే కథ తెలుసుకుంటే గణపతికి- అక్షరాలకు మధ్య సమన్వయం ఏమిటో తెలుస్తుంది.

### గణపతి వృత్తాంతం

గజాసురుడు తపస్సుచేసి శివుణ్ణిమెప్పించి, తనలోనే శివుడు వుండిపోయేట్లు వరంపొందుతాడు. శివుడు చేసేది లేక గజాసురుని లోనే ఉండిపోతాడు. పార్వతికి ఈ విషయంతెలిసి విష్ణువునిప్రార్థిస్తే నందిని గంగిరెద్దుగా మార్చి, బ్రహ్మాది దేవతలను తప్పెట్లు,తాళాలు, సన్నాయి మొదలగు వాయిద్యాలను వాయించే వాళ్ళుగా మార్చి, తాను గంగిరెద్దు ఆడించేవాడుగా తయారై గజాసురుడి ఎదుట గంగిరెద్దును ఆడించి, మెప్పిస్తాడు. గజాసురుడు ఆనందపడి వరం

కోరుకోమంటే—'మా గంగిరెద్దు మామూలు ఎద్దుకాదు, నందీశ్వరుడు. ఈ నందికి శివుడంటే ఇష్టం కాబట్టి శివుణ్ణి ఇవ్వు,' అని అనంగానే ఇదంతా ఆ విష్ణువుపనే అనీ, తనచావు నిశ్చయమైందనీ గ్రహించిన గజాసురుడు తాను చనిపోయినా తన తలకు త్రిలోక పూజార్హతను ప్రసాదించవలసినదని శివుణ్ణి ప్రాధేయపడతాడు. అందుకు పరేనని ఒప్పుకొని శివుడు గజాసురుని పొట్టను చీల్చుకుని బయటపడతాడు.

తన పతిఅయిన శివుడు వస్తున్నాడని తెలిసి, పార్వతి సంతోషించి, మంగళస్నానాలు చేసేముందు తనవంటిమీద నలుగుతో ఒక బాలుణ్ణిచేసి, ప్రాణంపోసి, వీధి ద్వారం వద్ద కాపలా వుంచి, స్నానానంతరం తానులోపల గదిలో శివునికై నిరీక్షిస్తూ ఉంటుంది. శివుడు ఇంటికిరాగానే వాకిట్లో కాపలావున్న బాలుడు అడ్డుపడడంతో ఆ బాలుని శిరస్సును త్రుంచి, లోపలికివెళ్ళి పార్వతిని కలుస్తాడు. మాటలమధ్యలో వాకిట్లో ఉంచిన బాలుని సంగతి ప్రస్తావనకు వస్తుంది. శివుడు తానుచేసిన పని చెప్తాడు. పార్వతి బాధపడి, తానే ఆబాలుణ్ణి చేసి, ప్రాణంపోసి. కాపలాఉంచానుఅనిచెప్పి,దుఃఖిస్తుంది. అప్పుడు శివుడు తాను తెచ్చిన గజాసురుని శిరస్సును ఆ బాలునికి అతికించి పునః ప్రతిష్ఠచేస్తాడు. ఆ గజముఖబాలుడే గణపతి అయి బ్రతికి ఇట్టకడతాడు. ఇదీ గణపతి జన్మకథ. ఈ కథ గణపతికి-అక్షరానికి గల సమన్వయాన్ని ఎలా వివరిస్తుందో చూద్దాం!

## అక్షర గణపతి

లిఖిత పూర్వకంగా వ్యక్తం చెయ్యడానికి ప్రతిభాషకు అక్షరాలువుంటాయి. మన భారతీయ భాషలన్నీ చాలా పకడ్బందీగా

వుంటాయి. అన్ని భారతీయ భాషలకు మూలమైనభాష సంస్కృత మనే చెప్పుకోవాలి. అందుకనే భారతీయ భాషలన్నింటికీ సంస్కృతంలో లాగానే అచ్చులు, హల్లులు, గుణింతాలు వుంటాయి. అ,ఆ, ఇ,ఈ, ...... మొదలైనవన్నీ అచ్చులు, క ఖ.గ.ఘ, ......మొదలైనవన్నీ హల్లులు. హల్లులను క-వర్గ. చ వర్గ ....ఇలా వర్గాలుగా లేదా గణాలు (BATCHES) లేదా గుంపులు (GROUPS)గా గూడా విభజిస్తారు. ఈ అక్షరగణాలకు అధిదేవతగా 'గణపతి'ని సంకేతిస్తారు. అందుకనే అక్షరాన్ని గణపతితో పోల్చి, గణపతి జన్మ కథలోని అంతరార్థాన్ని గ్రహించాలి.

ప్రతి అక్షరంలోను అచ్చుభాగం, హల్లుభాగం వుంటాయి. వాస్తవానికి క,ఖ,గ,ఘ- మొదలైన అక్షరాలు పూర్తిగా హల్లులు కావు. నిజానికి క్,గ్,చ్,జ్ మొదలైన పొల్లులే హల్లులు. ఈ పొల్లుకు అచ్చుకలిస్తే గాని పూర్తి హల్లు తాలూకు అక్షరంరాదు.

ఉదా॥ క్+అ=క; క్+ఇ=కి; క్+ఎ=కె; క్+ఋ=కృ త్+అ=త; త్+ఐ=తై మొ॥నవి

అంటే పొల్లుమీద అచ్చుచేరితేగాని హల్లు-అక్షరంగా బ్రతికి బట్టకట్టదు. అందుకే అచ్చులను 'ప్రాణము'లని హల్లులను 'దేహము' లని అంటారు.

అక్షరాన్ని గణపతితోపోలిస్తే-అక్షరంలో రెండు భాగాలున్నట్లే గణపతిలో గూడా రెండు భాగాలున్నాయి. గణపతి తలభాగం అచ్చును, క్రింది దేహభాగం హల్లును సూచిస్తాయి. ప్రతిజీవిలోను

కనబడే దేహభాగం-పదార్థత్వాన్ని (MATTER) సూచించే పార్వతికి సంబంధించినదిగాను, కనబడని ప్రాణభాగం- ప్రజ్ఞను(Consicousness) సూచించే పరమేశ్వరునికి సంబంధించినదిగాను అర్థం చేసుకోవాలి. ఎందుకంటే కనబడేది ప్రకృతి, కనబడనిది-పరమేశ్వరుడు కాబట్టి. అందుకే గణపతిదేహభాగం పార్వతి సమకూర్చినది కాగా ప్రాణప్రదమైన తలభాగం శివునిచేత సమకూర్చబడినది. అంతకు పూర్వం పార్వతి బాలునికి ప్రాణ ప్రతిష్ఠ చేసినా ఆ బాలుడు బ్రతకలేదు. శివుడు వచ్చి పునః ప్రాణ ప్రతిష్ఠ చేసినపుడే బాలుడు బ్రతికాడు. కాబట్టి, గణపతి అనే అక్షరంలో తలభాగం అచ్చును, దేహభాగం హల్లును సూచిస్తాయని తెలుసుకోవాలన్నమాట!

## గణపతి-గజముఖుడు

ఇప్పుడు ఇంకో సందేహంరావచ్చు. గణపతికి గజముఖాన్నే ఎందుకు పెట్టాలి? ఏ గొఱ్ఱెముఖమో, ఎద్దుముఖమో పెట్టవచ్చును గదా! గజముఖం పెట్టడంలో గల ఔచిత్యం, సమన్వయం చూద్దాం! 'గజము' అంటే 'గజంబద్ద' 'ఏనుగు' అనే అర్థాలు ఉన్నా ఇంకో శాస్త్రీయమైన అర్థంగూడా వుంది. 'గ'-అంటె గమనమువలన 'జ'-అంటే పుట్టునది. వస్తువునకు గమనం వల్ల పుట్టేదాన్ని భౌతిక శాస్త్రంలో ద్రవ్యవేగము (MOMENTUM) అంటారు. ఈ ద్రవ్య వేగంవల్లనే బలం (FORCE) గూడా సమకూరుతుంది. కాబట్టి 'గజము' అంటే 'బలము' అని గూడా చెప్పుకోవచ్చు. (ఇక్కడ అప్రస్తుతమైనా ఒక ముఖ్యవిషయం గూడా చెప్పుకోవాలి. 'అష్టదిగ్గజాలు' అన్నప్పుడు గూడా 'ఏనిమిది రకాల బలాలు' అనే అర్థం. సాధారణంగా అష్టదిగ్గజాలు అనంగానే "ఏవో ఎనిమిది ఏనుగులు

ఒక పెద్దబల్లను మోసినట్లు భూమిని ఎనిమిదిచోట్ల తొండాలతో పైకెత్తి మోస్తూవుంటాయి" అని అనుకుంటాం. ఇది తప్పు. ఇలా ఏమీ మొయ్యవు. రోదసిగోళంలో (SPACE GLOBE) భూమిపై ఒకేకాలంలో పనిచేసే ఎనిమిది రకాల బలాలవలన భూమి నిలబడి వున్నది. ప్రధానంగా - రవి, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు శుక్రుడు, శని,—ఈ ఏడుగోళాల వలన భూమి మీద ఏడు రకాల గురుత్వాకర్షణ బలాలు పని చేస్తాయి. ఈ ఏడూ కాక, భూమి తన చుట్టూతాను తిరగడం (ROTATION) వలన అపకేంద్ర బలం (CENTRIFUGAL FORCE) అనేది మరొకటి అదనంగా పని చేస్తుంది. ఈ ఎనిమిదిబలాలు ఎనిమిది దిశలవైపుగా పనిచేస్తూ భూమిని నిలబెడుతున్నాయి. ఈ ఎనిమిది బలాలనే 'అష్టదిగ్గజాలు' (EIGHTDIRECTIONALFORCES) అన్నారు. 'దిక్' అంటే దిశ (DIRECTION) అని గూడా అర్థం చేసుకోవాలి. ఉదా॥ నువ్వు ఈ దిక్కుగావెళ్ళు అంటే ఈ దిశగా వెళ్ళు అనేగదా అర్థం. సంతోషం, ఆనందం కలిగినపుడు ఎగరడాలు, గెంతడాలు, చుట్టూ తిరగడాలు చేస్తాము. అలాగే భూమి సూర్యుని చుట్టూ తిరగడంలో పొందిన ఆనందం వల్ల తన చుట్టూ గూడా తాను తిరుగుతోందనుకుంటే ఇలా తన చుట్టూ తాను సంతోషంతో తిరగడం వలన ఏర్పడిన బలం కాబట్టే ఆ చివరి ఎనిమిదో బలాన్ని "కుముదము" అన్నారు. "కు" అంటే భూమి, 'ముదము'—అంటే సంతోషము. అంటే ఇది అన్వర్థనామం అన్నమాట. అక్షరాలు కేవలం హల్లులరూపంలో వుంటే, వాటిని ఉచ్చరించడానికి చదవడానికి వీలుగా సాగవు. అలా సాగాలంటే ఆ హల్లులపై అచ్చులు గూడా వుండాలి. అక్షరాలు అలా ముందుకు సాగాలంటే కావలసిన బలం వాటికి అచ్చులు

చేకూరుస్తాయి. కాబట్టి అక్షరం అనే గణపతికి అచ్చు సమకూర్చే బలాన్ని సంకేతించడానికి ఎంతో అర్థవంతమైన 'గజముఖాన్ని' ఏర్పాటు చేశారన్నమాట!

వక్రతుండం

'గజం' అంటే ఏనుగు అనిగూడా అర్థం గదా! జాగ్రత్తగా పరిశీలిస్తే ఏ జంతువుకులేని విశిష్టలక్షణం ఏనుగుకు ఉందనితెలుస్తుంది. అదే దాని తొండం. ఈతొండంచాలా పొడవైనది. పైకి, క్రిందకు, ప్రక్కలకు ఇలా ఏలాపడితే అలామెలికలుతిరుగుతూసాగగలస్వేచ్ఛ గలది. అక్షరాలకు అచ్చులభాగాలైన అ–తలకట్టు ఇ–గుడి ఈ – గుడి దీర్ఘం ఉ - కొమ్ము ఏ - ఏత్వం మొదలైనవి గూడా అన్ని రకాలుగాను మెలికలు తిరిగి వుంటాయి· (సంస్కృత) నాగరిలిపిలో అయితే ఆ(ा), ఇ( ि ), ఈ( ी ) ఎ( े ), ఐ( ै ) ఔ( ौ ) మొదలగు వాటిని తీసుకోవాలి.) వీటిని సమకూర్చడానికి పొడవైన వక్రతుండం వీలుగా వుంటుందని సూచించడానికి గూడా తొండం కలిగిన గజముఖాన్ని సంకేతించారు. పైగా 'వక్ర' అంటే 'వంకర' అనిపైకి అర్థమైనప్పటికీ, 'వ' అంటే 'వర్ణ' 'క్ర'–అంటే 'క్రమము' అని సూచితాక్షరాలుగా (ABREVIATIONS) గా తీసుకుంటే (ఉదా॥ మోక్షము అన్న పదంలో మో-మోహ, క్ష-క్షయము అని తీసుకుంటే మోక్షపదానికి మోహక్షయమనే అర్థం రావడంలేదూ! అలాగన్నమాట!) వక్రతుండం అంటే 'వర్ణక్రమమునకుతోడ్పడు తుండము' అనిగూడ చెప్పుకో వచ్చును (ఉదా॥ 'గాజు' అనేపదం యొక్క వర్ణక్రమం చెప్పా లంటే 'గ'కార 'ఆ'కారముల-గా, 'జ'కార'ఉ' కారముల-'జు'-గాజు

అనిచెప్పాలి. లేకపోతే ఇంకో విధంగా-'గ'కు దీర్ఘమిస్తే 'గా','జ'కు కొమ్ము ఇస్తే 'జు' అనైనా చెప్పాలి. ఇలా చెప్పడాన్ని వర్ణ క్రమం చెప్పడం అంటారు. ఎందుకు ఇదంతా వ్రాస్తున్నానంటే ప్రస్తుతం పాఠశాలల్లో ఇలాంటివి అంతగా ఏమీలేవు గనక!)

లంబోదరుడు

గణపతి-విద్యాధిదేవత, అక్షరసంకేతుడు, అక్షరగణములకు అధిపతి. ఆయనపొట్ట అక్షరాలపుట్ట పొట్టకోస్తే అనంతమైన అక్షర సంబంధజ్ఞానమే ఉంటుంది. (మనలాగా పొట్టకోస్తే అక్షరం ముక్క లేకుండా వుండడం వుండదు) కాబట్టి 'గణపతి పొట్టచాలాపెద్దది' అని సూచించే అర్థంలో గణపతిని 'అక్షరకుక్షి,' 'అక్షయకుక్షి' 'లంబోదరుడు' అన్నారు.

విఘ్నేశ్వరుడు

'విఘ్నము' అంటే 'అడ్డంకి' 'అవరోధము' అని బాహ్యార్థాలు. కాని, మంత్రశాస్త్రంలో వేరేఅర్థంవుంది. క్,గ్,చ్,మొదలైనవేవి హల్లు లైనా ఉచ్చరించడానికి గొంతులో నాలుక అంగటిని తాకి అడ్డు కుంటేగాని సాధ్యంకాదు. అంటే లోపలినుండి వచ్చేనాదానికిఅడ్డంకి వల్ల'హల్లు' ఉచ్చరింపబడుతుంది. అందుకే హల్లులన్నిటినీ మంత్ర శాస్త్రంలో 'విఘ్నము' లంటారు. ఈ హల్లుల గణాలకు అధిపతి, లేదా ఈశ్వరుడు కాబట్టి గణపతిని 'విఘ్నేశ్వరుడు' అన్నారు.

ప్రణవస్వరూపుడు

గణపతి రూపాన్ని, సంస్కృతంలో 'ఓం' అక్షర ॐ రూపాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ రెంటికీ చాలాపోలికలు కనబడ

తాయి. '3'లాగావున్న దానిలో క్రింద వంకర భాగం గణపతి బొన పొట్టను, పైన వంకర భాగం తలను, పోలివుంటాయి. ఆ మధ్యనుండి ముందుకుసాగిన ~ (ఊకారం) తొండాన్ని పోలివుంటాయి. 3కి పైన వున్న. అర్ధచంద్రాకారం గీత-గణపతి ఏకదంతాన్ని పోలి వుంటుంది. ఆ అర్ధచంద్రాకారంలోని చుక్క-గణపతి కన్నును పోలి వుంటుంది. ఇన్నిరకాలుగా 'ఓం' కు సరిపోయేస్వరూపం వున్నవాడు కాబట్టి గణపతిని 'ప్రణవ' (ప్రణవం అంటే సంస్కృతంలో 'ఓం' కారం అని అర్థం) స్వరూపుడన్నారు.

## వినాయకుడు

'నయ్' అంటే సంస్కృతంలో 'నడిపించుట' అని అర్థం. కాబట్టి నాయకుడు అంటే నడిపించువాడు అని అర్థం వచ్చింది. అయితే గణపతి 'అక్షర' సైన్యాన్ని 'పద' వర్గాలుగా ఏర్పరచి, వాక్యవాహినిగా ముందుకు నడిపించే విశిష్టనాయకత్వం కలవాడు కాబట్టి 'వినాయకుడు' అన్నారు.

## సిద్ధిప్రదాత, బుద్ధిప్రదాత

ఈ సిద్ది బుద్ధులను గూర్చితెలుసుకోవాలంటే కొంత జ్యోతి శ్శాస్త్ర పరిజ్ఞానం కావాలి. ప్రతి సంవత్సరం భాద్రపద శుద్ధ చవితి నాడు వినాయక చవితివస్తుంది. ఆ రోజున సాయంకాలం పశ్చిమ దిక్కున ఆకాశంలోకి చూస్తే-హస్తానక్షత్రప్రాంతంలో చంద్రుడు వుంటాడని గుర్తించవచ్చు హస్తానక్షత్ర భాగంలో తారకలు అంటే చుక్కలు ఒక అభయహస్తం పట్టిన హస్త ఆకృతిలో వుంటాయి. ఇది గణపతి అభయ హస్తాన్నిస్ఫురింపజేస్తుంది. చతుర్థినాటి

చంద్రుని ఆకృతి గణపతి ఏకదంతాకృతిని స్ఫురింపజేస్తుంది. చంద్రుడు మనస్సుకు సంకేతం (చంద్రమా మనసోజాతః-పురుష సూక్తం) ఆ చంద్రుడు హస్తానక్షత్రంలో వున్నాడంటే 'మనస్సు' చేతిలో ఉందన్నమాట! అంటే సంకల్పించే మనస్సు-చేసే చేతిలో వుందన్నమాటేగదా! అంతకన్న వాక్సిద్ధికి కార్యసిద్ధికి, ఏం కావాలి. అందుకే గణపతి 'సిద్ధిప్రదాత'

వినాయక చవితినాడు చంద్రుడు హస్తానక్షత్రప్రాంతంలో వుంటాడుగదా! ఈ హస్తానక్షత్రం కన్యారాశిలో 10 డిగ్రీ నుండి 23 డిగ్రీల 20నిమిషాల మధ్య వుంటుంది. ఈ మధ్యలోనే 15వ డిగ్రీ కూడా వస్తుంది. 15వ డిగ్రీబుధగ్రహానికి(MERCURY) పరమోచ్చస్థానం, అంటే బుద్ధికి (HIGHER MIND OR INTELLECT) పరమోచ్చస్థానం. ఈ డిగ్రీవద్ద మనస్సనే చంద్రుడు ఉండడం ఆ మనస్సు పటిష్ఠమైన బుద్ధిలాగా పని చేయడాన్ని సూచిస్తుంది. కాబట్టి ఈ వినాయకుడు మంచి 'బుద్ధిప్రదాత' అన్నారు. ఈ సిద్ధి బుద్ధి ప్రధాన లక్షణాలు ఆయనను విడిచివుండరనే భావంలో 'సిద్ధి-బుద్ధులను ఆయన భార్యలన్నారు.

## శూర్పకర్ణుడు

గణపతి చెవులు చాటలంత వుంటాయి. చెవులు వినికిడికి గుర్తు చాటలంత చెవులు విస్తృతమైన వినికిడికి గుర్తు (అంటే ఇవి రాడార్ (RADAR) లాంటివన్నమాట లేదా డిష్ అంటినా (DISH ANTENA) లాంటివన్నమాట ఎవరైనా చెప్పినది. తు.చ. తప్పకుండా, స్పష్టంగా, నిర్దుష్టంగా వినగలగడంలో గణపతి ప్రవీ

ణుడు (EXPERT) అంతేగాదు ! గణపతి మంచి వ్రాయసకాడు. (SCRIBE) గూడా! చెప్పింది సరిగా వినగలిగి, ఆ విన్నదాన్ని ఏమీ పొల్లు పోకుండా వ్రాయగలిగిన వాడే ఉత్తమ వ్రాయసకాడు కాగలడు. వ్యాసుడు భారతాన్ని ఆశువారగా చెప్పుతున్నపుడువ్రాయ డానికి గణపతిని కూర్చుకున్నదందుకే! చేటంత చెవుల ద్వారా మనస్సులోపడిన మాటలన్నీ చేతిలోనికి తక్షణమే ( INSTANTAN EOUS) ప్రసారమౌతాయి. కాబట్టి అంత శీఘ్రగతిలో చెప్పినా వెంటనే వ్రాయగలిగాడు. పైగా చెప్పడం మధ్యలో ఆగితే-'నేనిక వ్రాయను' అని గూడా షరతుపెట్టాడు.మనస్సును(చంద్రుడు)చేతిలో (హస్తానక్షత్రంలో) వున్నవాడని ముందే చెప్పాను గదా!

**మూలాధార నిక్షిప్తుడు**

మనలో వెన్నెముక వెంబడి వుండే శక్త్యాత్మక చక్రాలలో (VITAL CENTRES) మొదటిదైన మూలాధార చక్రం పృథివీతత్త్వా నికి సంబంధించినది. (మహీంమూలాధారే-సౌందర్యలహరి-9) పృథివీతత్త్వం అంటే పూర్తిగా స్థిరత్వం పొందిన పదార్థత్వం అన్నమాట! జీవికి దేహం వుంటేనే అదిగూడా స్థిరమైన రూపంతో కనబడతాడు. అలాగే అక్షరానికి దేహం అయిన హల్లువుంటేనే అది గూడా స్థిరత్వం పొందుతుంది. అక్షరదేహాన్ని సూచించే హల్లుల గణాలకు (వర్గాలకు) అధిపతి కాబట్టి మూలాధారచక్రంవద్ద గణపతి (BATTALIAN LEADAR)లాగా వుంటాడని చెప్పడం కోసమే నిక్షిప్తాధార చక్రనిలయుడని ప్రారంభ పద్యంలో చెప్ప బడింది. ('వాతాపి గణపతిం భజే' పాటలో గూడా ఇలానే చెప్ప బడింది.)

**'వాక్సల్ల క్షణగుణ' విశేషణం**

అచ్చుల ప్రమేయంతో హల్లుల ఉచ్చారణకు ఒక చక్కని గమనము లేదా గతి ఏర్పడి ఉచ్చరింపబడే వాక్కుకు సత్+లక్షణము=సల్ల క్షణము ఏర్పడుతుంది. అని చెప్పడంకోసం 'వాక్సల్ల క్షణగుణ' విశేషణం గణపతికి మొదటి పద్యంలో చెప్పబడింది.

**మూషికవాహనుడు**

'ముష్' అనే సంస్కృత ధాతువుకు దొంగతనం, కుటిలత్వం, మోసం మొదలైన అర్థాలు చెప్పుకోవచ్చును. అందువల్ల నే'ముష్కరుడు' అనే సంస్కృతపదానికి 'దొంగ' అనే అర్థం వచ్చింది. వీలైనంతవరకు మనకు కనబడకుండా, తెలియకుండా మనింట్లోనే తిరుగుతూ, మన ఇంట్లో వుండే ధాన్యం, పప్పుదినుసులు మొదలైన ద్రవ్య సంపదను అపహరించి. హరించే 'ఎలుకను'గూడా అందుకనే 'మూషికం" అన్నారు. మన భవంతిలోని భౌతికమైన ద్రవ్య సంపదను దొంగిలించకలదేకాని మన బుద్ధిలోని జ్ఞాన సంపదను 'దొంగతనం'అనే ఆ ఎలుక ఏమీ చెయ్యలేదు. అక్షరమైన (నశించని) జ్ఞాన సంపదకు అధిపతి అయిన గణపతిని ఏమీ చెయ్యలేక ఆయన చెప్పుచేతులలో అణిగి మణిగి, ఆయనకు వాహనంగా వుంటుందనే అర్థంవచ్చేందుకు గణపతిని'మూషికవాహను'డన్నారు.

**అక్షర గణపతి**

ఇన్ని రకాలుగా గణపతికి-అక్షరాలకు సంబంధం ఉండబట్టే ఈ వ్యాసానికి 'అక్షరగణపతి' అని పేరు పెట్టడం జరిగింది. ఇట్టి అక్షరగణపతి అవసర సమయాల్లో అందరినీ ఆదుకుంటూ, అండగా వుంటాడు. కాబట్టి అందరం ఆయనను ఆద్యుడుగా ఆరాధిద్దాం! పూజ్యుడుగా పూజిద్దాం!

ఓం తత్ సత్

శ్రీసుబ్రహ్మణ్య స్వామినేనమః

# కుండలినీపతి

## (కుమారస్వామి)

సీ॥ భౌతికదేహ పార్వతికి నాత్మజుకున్
సారమైపుట్టు కుమారుడెవరు?
శుక్రధాతువు యొక్క సూక్ష్మతేజమ్ముగా
నారయ్యెడెవరు సుషుమాగ్నియందు?
షట్చక్ర కృత్తికా స్వచ్ఛసారసుధల
నందుచు పెరుగుషడాస్యుడెవరు?
ఆధారచక్ర పదార్థ తత్త్వమ్మును
సత్త్వమ్ముగా మార్చుశక్తుడెవరు?
గీ॥ సర్పవాలమునుండి శీర్షమ్ముదాక
వ్యష్టి కుండలినీ వల్లి కధిప తెవరు ?
అట్టి స్కందుండు కులదైవమగును మాకు
ముందు ప్రార్థింతు వానినేముక్తి కొరకు.

వివరణము :- తాత్త్విక దృక్పథాన్ననుసరించి ప్రతిజీవిలో ప్రధానంగా రెండు భాగాలుంటాయని చెప్పుకోవచ్చును.ఒకటి-ప్రజ్ఞ (CONSCIOUSNESS) రెండు-పదార్థము (MATTER), ఈప్రజ్ఞను పురుషుడు లేదా పరమేశ్వరునితోను, పదార్థాన్ని ప్రకృతి లేదా పార్వతితోను పోల్చిచెప్పటం భారతీయుల సంప్రదాయం. ఇవి

రెండూ ప్రతిజీవిలోనూ పరస్పరాధారపరిపూరకాలు (COMPLI MENTARY COUNTER PARTS) ఈ రెంటినీ-నేను (BEING), నాది (BELONGING) గా అర్థంచేసుకోవచ్చు.అందుకే ఈ రెంటినీ అర్ధనారీశ్వర తత్త్వంగా భారతీయులు దర్శించారు. చైనావారు ఈ అర్ధనారీశ్వర తత్త్వాన్నే 'ఇన్-యాన్' (YIN-YANG) అనే సంకేతంతో గుర్తిస్తారు. క్రిష్టియన్లు 'జిహ-వహ' జిహోవా అనే తత్త్వంగా గూడా గుర్తిస్తారు.

ప్రకృతి-పురుషులైన పార్వతీ పరమేశ్వరులను మనలో భౌతిక పదార్థానికి సంబంధించిన దేహంగాను-ఆ దేహాన్ని ధరించే 'దేహి' లేదా ప్రజ్ఞకు సంబంధించిన 'ఆత్మ'గాను సంకేతిస్తే-ఆ రెంటికీ మారుగా ఆ రెంటి సారభూతమైపుట్టుకుమారుణ్ణి కుమారస్వామితో సంకేతిస్తారు. ఇది పద్యంలోని మొదటి పాదానికి అర్థం.

సుషుమ్నామార్గం :- మనలో రస, రక్త, మాంస మేదోఽస్థి, మజ్జా, శుక్రాలనే సప్తధాతువులున్నాయి. (TISSUES) ఇవి స్థూలమైన ధాతువులు. అన్నిధాతువుల కంటె విలువైనది చివరిదైన శుక్రము. ఈ శుక్రము తరువాత గూడా కొన్ని ధాతువులుంటాయి. కాని, అవి స్థూలమైనవి కావు. వాటినే ఓజస్సు, భ్రాజస్సు, తేజస్సు, మొదలైన పేర్లతో పిలుస్తారు సంధ్యావందనంలో చెప్పే"ఓజోఽసి, సహోఽసి, బలమసి, భ్రాజోఽసి, దేవానాం ధామ నామాసి, విశ్వమసి విశ్వాయుః, సర్వమసిసర్వాయుః, అభిభూః ఓం" అనే మంత్రం ఈ ధాతువులను గురించే చెబుతుంది. వీటిని సూక్ష్మమైన ధాతువులుగా చెప్పుకోవచ్చు.

పైన చెప్పిన సూక్ష్మధాతువుల్లో చివరిమెట్టు "ఓం". "శుక్రం" నుండి 'ఓం' దాకా జరిగే మార్పుల తాలూకు మెట్లు మనలో మూలాధార చక్రం నుండి సహస్రారం దాకా వెన్నెముక వెంబడివున్న షట్చక్రమార్గంలో ఉంటాయి. దీనినే 'సుషుమ్నామార్గం' అంటారు. వెన్నెముకలోని వెన్నుపాము అనే దాంట్లో మూడు నాడులుంటాయి. ఒకటి పింగళానాడి, ఇది సూర్యాత్మకము (SOLAR). రెండవది ఇడానాడి, ఇది చంద్రాత్మకము (LUNAR). ఇక మూడివది సుషుమ్నానాడి, ఇది అగ్నితత్త్వాత్మకము (FIREY OR ILLUMINA TVIE) లలితాసహస్రనామాల్లో "మహాసక్తిః, కుండలినీ, బిసతంతు తనీయసీ' అనే నామాలు ఉంటాయి. 'మహాసక్తి సంపన్నమైన కుండలినీశక్తి యొక్క సుషుమ్నామార్గము—తామరతూడు విరిస్తే వచ్చే సన్నని దారం పోగులాగా వుంటుం' దని ఈ నామాలవరుసకు అర్థంగా కూడా చెప్పుకోవచ్చును.

జ్వరం పెరిగినకొద్దీ థర్మామీటరు క్రిందిబల్బులో నుండి పాదరసం కేశనాళిక గొట్టం (CAPILLARY BORE)లోకి ఎలా ప్రాకుతుందో అలాగే యోగాభ్యాసంలో ఉపాసకుని సాధన పరిపక్వమవుతున్నకొద్దీ మూలాధారం వద్ద ఉన్న శుక్రధాతువు తేజస్సు, భ్రాజస్సు, మొదలైన సూక్ష్మతేజస్సులుగా మారుతూ ఈ సుషుమ్నామార్గం ద్వారా సహస్రారం దాకా పైకి ఎక్కుతుంది. కొన్ని జ్వర పరీక్షలలో వైద్యులు వెన్నెముక నుండి SPINAL FLUID తీస్తారు. అప్పుడు సిరింజిలోకి ద్రవరూపంలో ఒక FLUID వస్తుంది. నిజానికది వెన్నెముకలో ద్రవరూపంలో ఉండదు. వెన్నెముకలోని సుషుమ్నా మార్గంలో తేజస్వంతంగా ఉంటుంది. సూక్ష్మస్థితిలో ఉన్న నీటియావిరి (STEAM)వున్న రబ్బరు గొట్టంలోకి సిరింజి

గుచ్చిలాగితే నీటియావిరిరాదు, దానిస్థూలస్థితిలో ఉండేనీళ్ళేవస్తాయి. అలా అన్నమాట! కాని ఈ SPINAL FLUIDను తప్పనిసరి అయితే తప్ప వీలైనంతవరకు తీయనీయకుండా ఉండడమేమంచిది. ఆ FLUIDను తీయించే కొద్దీ తేజస్సు (ILLUMINATION), తెలివి (INTELLIGENCE) కూడా రానురాను తగ్గిపోతాయి.

**అగ్నిపుత్రుడు**

శుక్రం అధోమార్గంపట్టి పురుషాంగంద్వారా స్త్రీ గర్భంలో పడితే భౌతిక సంతానం కలుగుతుంది. కాని అదే శుక్రం ఊర్ధ్వమార్గం పట్టి మూలాధారం నుండి సహస్రారం దాకా ఉండే సుషుమ్నామార్గంపడితే అదే మనిషికి తేజస్సు పుట్టి పెరుగుతుంది. అలాపుట్టి పెరిగే తేజస్సునే "కుమారు" ఉంటారు. సుషుమ్నామార్గం అగ్నితత్త్వం కాబట్టి, అగ్నివల్ల ఆ కుమారుడు పుట్టి పెరుగుతాడనే దాన్ని సంకేతంగా పురాణాల్లో కుమారస్వామి అగ్ని పుత్రుడుగా చెప్పబడ్డాడు. అగ్నితత్త్వమైన సుషుమ్నలోని ఈ కుమారుణ్ణి అతి శుచివంతునిగా, పుణ్యమూర్తిగా "ఆర్యుడు" అనడం జరిగింది—పద్యం రెండవపాదంలో.

**సర్పాకార దేవత**

ఇక్కడ ఇంకో విషయం చెప్పుకోవడంకూడ చాలా సందర్భ శుద్ధిగా ఉంటుంది. తాతనుండి తండ్రికి, తండ్రినుండి పుత్రునికి ఇలా ఒకతరం నుంచి తర్వాతతరానికి శుక్రరూపంలో తేజస్సు వస్తుంది. శుక్రంలోని ఒక వీర్యకణాన్ని సూక్ష్మ దర్శినిలో పరిశీలిస్తే అది చిన్న సర్పాకారంలో (SPERM TOZOVA) ఉంటుంది. తాత, తండ్రి, కొడుకుల తరాల్లో ఎక్కడన్నా ఈ శుక్రానికి అపచారం జరిగితే (అంటే-వ్యభిచారాదిదోషా

లంటితే) ఆ వంశంలో చివరికి సర్పదోషం సంక్రమిస్తుంది. పిల్లలు పుట్టక పోవడమో, పుట్టిన పిల్లలు దక్కకపోవడమో, అవలక్షణాలతో పుట్టడమో, గర్భస్రావాలు జరగడమో, కడుపులో శిశువు మరణించటమో ఇందువల్ల జరుగుతుంది. అప్పుడు సుబ్రహ్మణ్యస్వామిని ఆరాధిస్తే మరల దోషం కొంతవరకు పరిహారమవటానికి అవకాశం ఉంటుదనడం ఇందుకే. సుబ్రహ్మణ్యస్వామిని ఆరాధించడమంటే శుచిగా తనప్రకాశ్ని కాపాడుకోవడమన్నమాట! (సు-అంటే మంచి బ్రహ్మణ్యుడు-అంటే తేజస్వి. తేజస్సు కలవాడని అర్థం కాబట్టి అగ్నిపుత్రునిగా పూర్ణమూర్తి, శుచిమంతుడు అయిన కుమారస్వామిని "సుబ్రహ్మణ్యస్వామి" అని గూడా అంటారు. సర్పాకృతిలో ఉండే శుక్రకణ తేజస్సుకు సంబంధించినవాడు కాబట్టి ఈ సుబ్రహ్మణ్య స్వామిని సర్పాకార దేవతగా ఆరాధిస్తారు.)

షణ్ముఖుడు

మూలాధార, మణిపూరక, స్వాధిష్ఠాన, అనాహత, విశుద్ధి, ఆజ్ఞాచక్రాలను షట్చక్రాలంటారు. పద్మాలు సూర్య తేజస్సు వల్ల వికసిస్తాయి ఈ చక్రాలు గూడా సుషుమ్నామార్గంలో పైకి ఎక్కే శుక్రతేజస్సుస్పర్శవల్ల వికసిస్తాయి. అందువలన ఈ చక్రాలను పద్మాలని గూడా అంటారు. పద్మంలోని మకరంద మాధుర్యగుణం ఎలాంటి ప్రేమ పూరితమైందో, స్త్రీ స్తన్యముగూడా అలాంటి సుధాపూరితప్రేమ తత్త్వాన్నే తెలియజేస్తుంది. ఆ సుధా స్తన్యాన్ని గ్రోలి శిశువు వెలుగొందుతూవృద్ధి చెందుతాడు. అలాగే "సుషుమ్నలోని శుక్రతేజస్సనే కుమారుడుకూడా ఈ షట్పద్మమాధుర్య స్తన్యాన్ని గ్రోలుతాడు." అని చెప్పటానికి షట్కృత్తికల దగ్గర క్షీరాన్ని తన ఆరుముఖాలతో (ముఖం అంటే సంస్కృతంలో నోరు అని అర్థం) గ్రోలి వెలుగొందుతూ వృద్ధి చెందుతాడని పురాణకథలో

సంకేత పూర్వకంగా చెప్పబడింది. అందుకే కుమారస్వామిని కార్తికేయుడంటారు. అంతేకాదు. ఈయన జన్మతిథి షష్ఠి (ఆరుముఖాలకి ప్రతీకగా) అని చెప్పడం గూడా ఇందుకే! (సుబ్రహ్మణ్యషష్ఠి మనకి పండుగరోజుగూడా!) ఆయనకు సంబంధించిన మంత్రబీజాక్షరాలు గూడా "శ,ర,వ,ణ,భ,వ" అని ఆరుగూడా ఇందుకే!

### జ్యోతిశ్శాస్త్ర సమన్వయం

మనలో భౌతిక వదార్థాలలో అత్యంత దృఢమైన పృథివీతత్త్వాన్ని మూలాధారచక్రం క్రమబద్ధం చేస్తుంది. అలాగే మణిపూరకం - జలతత్త్వాన్ని, స్వాధిష్ఠానం - అగ్ని తత్త్వాన్ని, అనాహతం-వాయుతత్త్వాన్ని, విశుద్ధి-ఆకాశతత్త్వాన్ని. ఆజ్ఞ-మనస్తత్త్వాన్ని క్రమబద్ధం చేస్తాయి. అంటే మనలో భౌతికమైన బలం అంతటికీ మూలాధారం వద్ద స్విచ్ ఉంటుందని అర్థం చేసుకోవాలి. శిరస్సుపై బ్రహ్మరంధ్రంవద్ద నుండి వెన్నెముక మార్గంలో రాశుల్ని న్యాసంచేస్తే-మేషం-శిరస్సును,వృషభం-ముఖాన్ని,మిథునం కంఠాన్ని. కర్కాటకం-ఊపిరితిత్తులను, సింహం—హృదయాన్ని, కన్య చిన్నప్రేవులను, తుల కటిప్రదేశాన్ని, వృశ్చికం జననేంద్రియ పురీషావయాలను తెలియజేస్తాయి. అంటే మేషం నుండి వృశ్చికం దాకా ఉండే రాశుల క్రమం మనలో శిరస్సునుంచి వెన్నెముకచివరి దాకా ఉండే మార్గాన్ని సూచిస్తుంది ఇదే విధంగాఅశ్విని, భరణినక్షత్రాలను గూడా న్యాసం చేస్తే ఈ వృశ్చికాంతానికి జ్యేష్ఠనక్షత్రం పూర్తవుతుంది. ఇంక మూలానక్షత్రం ధనుస్సుమొదట్లోకివస్తుంది, ఆధారచక్రం గూడా ఈ మూలానక్షత్రం వద్దే ఉంటుంది. అందుకనే ఆధార చక్రాన్ని "మూలాధారచక్రం" అని గూడా అంటారు.

బలిచక్రవర్తి

మన శిరస్సుపై బ్రహ్మరంధ్రము నుండికంఠం దాకా ఉండే భాగాన్ని దేవలోకం (PLANE OF LIGHT) అనీ, కంఠంనుండి నాభిదాకా ఉండే భాగాన్ని మర్త్యలోకం (Plane of human Beings) అనీ, నాభినుండి క్రింది భాగాన్ని పాతాళ లోకం అనీ-పురాణాల్లో, సంకేతిస్తారు. దేవలోకంలో దేవతలు, మర్త్యలోకంలో మనుష్యులు, పాతాళలోకంలో రాక్షసులు ఉంటారని చెప్తారు. మన భౌతికబలం మీద మనకున్న విశ్వాసాన్ని బలి చక్రవర్తితో సంకేతిస్తారు. అంటే మన సమస్త బలానికి సంకేతం బలిచక్రవర్తి. మనభౌతికబలం అధారచక్రం వద్ద వర్తిస్తుంది. కాబట్టి బలిచక్రవర్తి అన్నారు. హరి (పోషకకారుడు) తనపాదాలతో ఆ బలిచక్రవర్తిని పాతాళలోకానికి అణగద్రొక్కాడు,అన్నకథను ఇక్కడ ఇలా సమన్వయపరచుకోవాలి. అంటే బలం యావత్తు మూలాధార చక్రం వద్ద కేంద్రీకృతమై క్రమబద్ధం అవుతుందన్నా,పురాణపరంగా బలిచక్రవర్తి పాతాళానికి అణగద్రొక్కబడ్డాడన్నా ఒకటేఅర్థం అన్న మాట!

కుమారస్వామి-కుజుడు

జ్యోతిశ్శాస్త్రంలో గూడా కుజుడు(MARS) మనభౌతిక శక్తికి [Material Strength] కారకుడు· ['సత్త్వంకుజో!-బృహజ్జాతకం] అంటే మనం తినే పదార్థాలన్నిటినీ సత్త్వం [శక్తి]గా మార్చటానికి కారకుడు కుజుడన్నమాట. "కు"-అంటే "వక్ర" లేదా "వంకర," వలయం-అంటే వంకరగా నున్న తలం కలిగినట్టిది. కాబట్టి భూమికి "కువలయం" అనే పేరుంది. ఈ కువలయం అంటే-భూమి పదార్థానికి, మనలోదేహానికి,రాశిచక్రంలో

లగ్నానికి సంకేతం. చంద్రుడు-మనస్సుకు[ 'చంద్రమా మనసో జాతః'-పురుషసూక్తం. లేదా 'మనస్తుహిమగుః'-బృహజ్జాతకం] సూర్యుడు-ఆత్మకు [కాలాత్మాదినకృత్-బృహజ్జాతకం] సంకేతాలు. పదార్థమంటే ప్రకృతి-అంటే పార్వతికాబట్టి "కు" అంటే భూమికి "జ"-అంటే పుట్టినవాడు. అనగా భూమిపుత్రుడు లేదా పదార్థపుత్రుడు లేదా ప్రకృతిపుత్రుడు లేదా పార్వతీ పుత్రుడు అవుతాడు. అందువలన 'కుజ' అంటే కుమారస్వామిగా అర్థం చెప్పుకోవాలి. మనం తిన్న ఆహార పదార్థాలను సత్త్వంగా [శక్తి]మారుస్తాడు-కాబట్టి ఈయన చేతిలో శక్తి ఆయుధం వుంటుందన్నారు. శక్తిధరుడు) ఈ కారణాల వల్ల పైపద్యంలో ఆధారచక్రపదార్థ తత్త్వమ్మును సత్త్వమ్ముగా మార్చుశక్తుడెవరు" అనడం జరిగింది. అగ్నిపుత్రుడు కాబట్టి జఠరాగ్నికి కూడా ఈ కుమారుడనే కుజుడు అధిపతి. అందుకే జాతకంలో కుజుడు బలంగా వుంటే శక్తి, ఆకలి తిండి కూడా ఎక్కువ అని చెప్పవచ్చు.

**ఆసాంతము-అంటే ?**

మనలో సుషుమ్నామార్గం-శిరస్సువద్ద తలగలిగి క్రిందికి వ్రేలాడుతూ పూర్వం చెప్పిన వెన్నెముక చివర తోక కలిగిన ఒకపాములాగా-ఉంటుంది. అందుకనే వెన్నెముకలోగల ఈ మార్గాన్ని "వెన్నుపాము"అని గూడా అన్నారు కాబట్టి "సర్పవాలం" అంటే ఆధారచక్రం అనీ "శీర్ష" మంటే సహస్రారం అనీ అర్థం. ఆధార, సహస్రారపదాల మొదటి అక్షరాలు కలుపుతూ వేరే ఒక క్రొత్త పదం పుట్టింది. అది "ఆసాంతము" [ఆ+స+అంతము]అంటే ఆధార చక్రం నుంచి సహస్రారం దాకా అని అర్థం. యోగ విషయమంతా ఈ రెండు చక్రాల మధ్యనే ఉంది. ఏదైనా ఒక విషయం

పూర్తిగా తెలుసునా? అనడానికి "అసాంతము" తెలుసునా అనడం సామాన్యమైపోయింది, [అమూలాగ్రం అన్నా ఇదే అర్థం. మూలం అంటే క్రిందవున్న మూలాధారం అనీ, అగ్రం-అంటే పైన ఉన్న సహస్రారం అనీ అర్థం.]

మూడున్నరచుట్లు ?

ప్రతి మనిషిలో వెన్నుపాము తలనుండి తోకవరకు గల మార్గాన్ని వ్యష్టికుండలిని Individuval Kundalini] అంటారు. దీని శక్తి ఎవరికైనా మూలాదారం వద్ద [3 1/2] చుట్లు చుట్టుకొని నిద్రించేపాములాగా ఉంటుంది. [వ్యాపిషికుంకుండే కుహరిణి-సౌందర్యలహరి]సాధనచేయనివానికి, చేసేవానికి కూడా ఈ కుండలినీ శక్తి ఉంటుంది. సాధన చేయనివానిలో మూలాధారం దగ్గర నిద్రిస్తూ ఉంటుంది. సాధనచేసే ఉపాసకునిలో అది మేల్కొని సుషుమ్నామార్గాన్న ననుసరించి సహస్రారాన్ని చేరడం జరుగుతుంది. [ఇంట్లో టి.వి. వున్నా, మేడమీద ఏరియల్ లేదా అంటినా వున్నా-ఉపయోగించుకొనే విధానం [OPRATION] తెలియకపోతే అవి ఎంతనిరుపయోగమో ఈ కుండలినీశక్తిని ఉద్బోధము చేయనపుడు గూడా అంతే ఉపయోగము.

ఇంక మూడున్నర చుట్ల మాటేమిటి? జీవపరిమాణంలో [Evolution]మానవుడుఖనిజ [Mineral] కక్ష్యను, వృక్ష(Plant) కక్ష్యను, జంతు[Animal] కక్ష్య నుపూర్తిచేసి మానవ కక్ష్యలోకి అడుగుపెట్టినా ఈ మానవ కక్ష్యలో కలుగవలసిన సంస్కారము పూర్తిగా కలుగలేదు అర్థభాగము మాత్రమే కలిగి యున్నది. అటుపైన జరగవలసిన అర్థవృత్తభాగము ఉపాసనా లేదా యోగా భ్యాస సాధనవలన జరుగవలసినదే-అని సూచించుటకు 1+1+1+

1/2=3 1/2 చుట్లు అని చెప్పారు. మూలాధారము వద్ద నున్న కుండలినీశక్తి వలయాకారపు చుట్లు చుట్టుకొని ఉంటుంది. కాబట్టి దీనిని 'వల్లి' అన్నారు. ఈ వలయాలకుండలినీవల్లికి అధిపతి కుమారస్వామి అన్నారు. అందుకే పురాణాల్లో వల్లీనాథునిగా కుమారస్వామిని సంకేతించారు. పుట్టినప్పటి నుండి దేవతలసేనకు[దేవసేన] నాయకుడై, రాక్షససంహారం చేస్తూ, వేరే ఇల్లు ఇల్లాలు ధ్యాస లేకుండా దేవసేనతో గడిపేవాడు కాబట్టి దేవసేనకు నాథుడుగా సంకేతించారు.

ఈ కుమారస్వామి మంచి వర్చస్సు [సుబ్రహ్మణ్యుడు]గల్గినవాడు కాబట్టి సుబ్రహ్మణ్యునిగా కీర్తించారు. అట్టి సుబ్రహ్మణ్యుడు మాకు ఇలవేల్పు. ఆ ఇలవేల్పును ముందుగా ప్రార్థిస్తున్నాను. ఈ ప్రార్థన గూడా రక్తికీ, శక్తికి, భుక్తికికాదు-'ముక్తికి' అని చెప్పడం జరిగింది. మూలాధారం వద్దవున్న కుండలినీ 'శక్తి' సుషుమ్నా మార్గం ద్వారా షట్చక్రాలను ఛేదించుకుంటూ, చిట్టచివరకు సహస్రారంలో వున్న 'శివుని'లో ఐక్యం చెందడమే ముక్తి. సందర్భశుద్ధికై-శంకర భగవత్పాదుల ఈ క్రింది శ్లోకంతో ఈ వ్యాసం ముగిస్తాను.

శ్లో॥ మహీం మూలాధారే, కమపిమణిపూరే, హుతవహం
స్థితం స్వాధిష్ఠానే, హృదిమరుత, మాకాశముపరి,
మనోపి భ్రూమధ్యే, సకలమపి భిత్వాకులపథం,
సహస్రారే పద్మే సహరహసిపత్యా విహరసే"

(సౌందర్యలహరి-9వశ్లోకం)

ఓం తత్సత్